శ్రీః

శ్రీవాదిరాజతీర్థవిరచితః

# శ్రీహయగ్రీవదణ్డకః

తెనుగుటీక : డా॥ ముళ్ళపూడి విశ్వనాథశాస్త్రి



ప్రకాశకురాలు

**శ్రీమతి రావి కృష్ణకుమారి**

**404, జంజనం కాంప్లెక్స్, చీరాల - 523 155.**

శ్రీః

శ్రీవాదిరాజతీర్థవిరచితః

# శ్రీ హయగ్రీవదణ్డకః

**తెనుగుటీక : డా॥ ముళ్ళపూడి విశ్వనాథశాస్త్రి**


ప్రతులు : 500

ప్రథమముద్రణ : దీపావళి 2019

పుటలు : 16

వెల : అమూల్యం



404, Janjanam Complex,
Opp. I-Town Police Station,
**CHIRALA** - 523 157. **Cell : 94401 15411**


D.T.P.:
P. PARVATHI
Cell : 7416586775.

Printed at :
KARSHAK ART PRINTERS
Hyderabad.

శ్రీః

శ్రీవాదిరాజతీర్థవిరచితః

# శ్రీహయగ్రీవదణ్డకః

జయజయ తురంగాస్య!, నస్తో ముఖాన్నిస్సృతానన్తవేదాదివిద్యాప్రబోధీ-
కృతామ్భోజసమ్భూత! హేషారవోన్నిర్జితాశేషదైతేయ!, లక్ష్మ్యాఽమృతేనానిశం సిచ్యమానాఙ్గ!,
రాకేన్దుకోటిప్రతీకాశదేహప్రభాభాసితాబ్జాతగర్భాణ్డబాహ్యాన్తరానమ్రధాత్రీశరుద్రేన్ద్రముఖ్యామర-
వ్రాతకోటీరమాణిక్యకాన్తిచ్ఛటారఞ్జితాఙ్ఘ్రే!, శరచ్చన్ద్ర! హృన్మన్దిరధ్వాన్తరాశేః, 1

ప్రపన్నామరానోకహస్త్వం పురా దేవ! నారాయణాఖ్యేన రూపేణ లోకం స్వగర్భే
నిధాయ; శ్రియో బాహుయుగ్మాన్తరే సంస్థితస్సన్, సిసృక్షుస్త్వమాదౌ విధాతారమాసృజ్య,
తత్సత్రయాగే హయగ్రీవరూపం సమాస్థాయ; దైత్యాధమం లోకశత్రుం మధుం కైటభాఖ్యఞ్చ
చక్రేణ హత్వా, పునర్లోకసంరక్షణార్థం ఝషాద్యావతారైర్మహాదైత్యసఙ్ఘాన్ వినిర్మథ్య, లోకాన్
సదా పాసి; భో దేవ! యస్త్వాం మనుష్యోత్తమో దుగ్ధపాథోధిమధ్యస్థసుశ్వేతనామోల్లసద్ద్వీపమధ్యే
సుసన్తానవృక్షావలీవేష్టితే సన్మణిస్తమ్భయుక్తే మహామణ్డపే తత్ర పఙ్కేరుహే కర్ణికాయాం
సుధాసూతిబిమ్బే మహాయోగపీఠే నిషణ్ణమ్, 2

నమద్దేవతామౌలిమన్దారమాలాస్రవన్మాకరన్దద్రవక్షాళితేనాఙ్కుశచ్ఛత్రపాఠీన-
వజ్రామ్బుజాతోర్ధ్వరేఖాఙ్కితేనాఙ్ఘ్రియుగ్మేన సంరాజితం; శ్వేతకూర్మాభగుల్ఫం,
లసజ్జానుయుగ్మం, దిశాదన్తిశుణ్డోపమోరుద్వయం, దుగ్ధసిన్ధ్వన్తరీపోపమేనాచ్ఛ-
కౌశేయవస్త్రాభిరామేణ భాస్వన్నితమ్బేన యుక్తం, వియద్వాహినీవర్తులావర్తగమ్భీర-
నాభీసరస్తీరసఞ్జాతరోమావలీమణ్డితేనోదరేణాఞ్చితం, శ్రీనివాసాయితోరఃస్థలం,
శేషభోగాభహస్తైశ్చతుర్భిస్సదా శఙ్ఖముక్తాక్షమాలాలసత్పుస్తకోద్బోధయుక్తారవిన్దాని సమ్యక్
దధానం, రణద్భృఙ్గసంసక్తసంఫుల్లమన్దారమాలావలీలగ్నసత్కణ్ఠశోభాభిరామం,
శశాఙ్కాంశుసఙ్కాశసత్కేసరవ్రాతకేశావలీమణ్డితం, దన్తకాన్తిచ్ఛటాభాసితాశావకాశం,
దలత్పద్మపత్రాయతాక్షం, స్ఫురద్దక్షిణావర్తశఙ్ఖప్రతీకాశకర్ణం, లసన్మస్తకం, దివ్యముక్తా-
మయోదారకోటీరకేయూరహారావలీమేఖలాద్యాఖిలైర్ భూషణైర్ భూషితం, చన్దనాచర్చితా-

శేషగాత్రం, సదా మూర్తిమద్వేదశాస్త్రేతిహాసాదివిద్యావలీసేవితం, శ్రీసతీచఞ్చలాపాఙ్గ-నీరాజితం, బ్రహ్మరుద్రాదివన్ద్యం, మనఃపఙ్కజే చిన్తయన్, 3

దేవ! బాహ్యే హరిద్గోమయాలిప్తకే రఙ్గవల్లీసుశోభాఞ్చితే స్థణ్డిలే శ్వేతకౌశేయ-వస్త్రావృతే మాలతీమల్లికాదిప్రసూనావలీమణ్డితే చక్రపద్మాదిసన్మణ్డలోపేతపీఠే యథా యాజ్ఞికా బాహ్యవహ్నౌ నిజాన్తఃస్థమగ్నిం సమాకృష్య మంత్రాక్షతైః స్థాపయిత్వాఽర్చయన్తి స్మ, తద్వద్బహిర్యోగమార్గేణ హృత్పద్మమధ్యస్థమీశం స్వబిమ్బే ప్రతిష్ఠాప్య, నిత్యం త్వదష్టాక్షరే-ణోక్తమార్గేణ సంపూజయన్ వర్తతే, దేవ!, 4

యద్వా, సువర్ణాదిసల్లోహపాత్రేషు వా భూర్జపత్రేషు వా పట్టవస్త్రేషు వా వహ్నిపూర్వాణదిగ్రాజదన్తారకేషు క్రమాదేకవర్ణం త్వదీయం లిఖిత్వాఽథ పఞ్చాక్షరం గారుడం చాష్టవర్ణం స్వరానుష్టుభం సమ్యగాలిఖ్య తద్వత్ బహిర్బీజమార్గేష్వసఙ్గాక్షరైః కాదిసాన్తైః క్రమాద్వేష్టయిత్వా, తతో వ్యోమయుగ్మం ధరామణ్డలే దిక్పతీనాం చ బీజాని సంలిఖ్య, త్వద్బిమ్బవత్ గన్ధపుష్పోపహారాదిభిర్ భక్తిభావేన సంపూజ్య సన్మన్త్రసిద్ధో భవేత్, తస్య వక్త్రే స్థిరా శారదా, తస్య గేహే ధ్రువా శ్రీః, స్వయం తస్య దాసా నృపాలాదయస్, తస్య భక్తిర్భవేత్ శాశ్వతీ, తస్య విద్యాః స్ఫురన్త్యశ్రుతప్రజ్ఞయా, తస్య పుత్రాదివృద్ధిర్భవేత్, తస్య వాఞ్ఛా లభన్తేఽఖిలాః, దేవ!, 5

యద్వా, మనోర్జ్ఞఙ్పూకో భ్రువోరన్తరే త్వాం సమస్తాగమానుద్గిరన్తం సమాచింత్య, తత్రైవ దీర్ఘాన్వితం బిన్దుయుక్తం చతుర్థోష్మరూపం మనుం సాన్వితం సమ్యగుచ్చార్య సాయం ముఖే ముక్తనామాసనే సంనివేశ్యానిలం చేళయా పూరయన్ కేవలే కుమ్భకే సంస్థితస్సన్, తతోర్ధ్వీకృతేన స్వజిహ్వాగ్రభాగేన రంధ్రం నిరుధ్యోద్గతం సోమనీరం పిబేత్ ప్రత్యహం, తస్య గీర్వాణవాణీ వశా, తస్య పాతఞ్జలం స్యాత్ జలం, తస్య భాట్టం ఘరట్టోత్థపిష్టోపమం, తస్య తర్కస్తు పాణిస్థకర్కన్ధుకా, తస్య వైయాసకీ గీర్మరున్మోచికా, సైష వాదేషు పఞ్చాననో, దేవ! యో వా ఘృతం బ్రాహ్మికాపాచితం వాఽథవా కఙ్గులీబీజజాలాని వాచాఽభిమన్త్ర్య త్వదీయేన మన్త్రేణ నిత్యం పిబేత్ ఖాదయేత్, తస్య వక్త్రే కవిత్వం సుధాసంమితం సంభవేత్, తస్య బుద్ధిః బహుగ్రన్థసన్ధారిణీ స్యాత్, 6

ప్రభో! దేవ! యత్తే పదామ్భోజశౌచోదకం శూలపాణేశ్శిరోభూషణం, యస్య నాభ్యుద్భవో లోకనిర్మాణకృత్ పద్మభూర్, యస్య పౌత్రో హరః సర్వసంహారకృత్, యస్య నిఃశ్వాసరూపాస్సమస్తాగమాః, యస్య పత్నీకటాక్షస్య లేశో విధీశేన్ద్రముఖ్యామరస్థానదో, యస్య

తల్పం సశైలాటవీసిన్ధువిశ్వమ్భరాధారకశ్శేషభోగీశ్వరో, యస్య వాహోత్తమస్సర్వవేదాభిమానీ ఖగాధీశ్వరో, యస్య వక్త్రాగ్నిమధ్యే సురారాతిసఙ్ఘాః పతఙ్గా బభూవుః, స్వయం యస్య దివ్యాహ్వయో భక్తిభాజాం నృణాం తీర్థకోట్యుత్థపుణ్యాధికో, యస్య విజ్ఞానభక్త్యాఖ్యసత్-ద్రవ్యసమ్పాదకానాం భవేదక్షయానన్దభోగః, ప్రభో!, 7

దేవ! తం త్వామహం సచ్చిదానన్దమూర్తిం, జగజ్జన్మసంరక్షణజ్ఞానసంహార-బన్ధాదిహేతుం, నిరస్తాధికం, నిస్సమం, సద్గుణామ్భోనిధిం, నిత్యముక్తం, నిజానన్దతృప్తం, విభుం, నిర్గతాశేషదోషం, నిరీశం, స్వరోమావలీకూపసంస్థాబ్జగర్భాణ్డకోటివ్రజం, ముక్తవాగీశభోగీశపక్షీశదేవేశకన్దర్పసూర్యాదిముఖ్యామరైస్సేవితం శ్రీకరామ్భోజరత్నోర్మికా-దీధితిస్తోమశోణీకృతాఙ్ఘ్రిద్వయం, భక్తలోకార్జితానేకజన్మాఘశుష్కాటవీపావకం, సర్వవేదైకవేద్యం, సర్వదేవైకవన్ద్యం, మహాయోగిహృన్మణ్టపం, సన్తతానన్తభోగాసనం, దేవదేవం ప్రణమ్య, ప్రభో! ప్రార్థయే, 8

సాధునిన్దాऽऽత్మశంసాऽశ్రుతగ్రన్థవేత్తృత్వదుఃశాస్త్రవేత్తృత్వదుష్టాన్నభోక్తృత్వ దుష్టాత్మసేవాద్యనన్తాపరాధాలయం, నిత్యకర్మాద్యనుష్ఠానదూరం , దురాచారిణం, జ్ఞానహీనం, సదా క్రోధలోభాద్యమిత్రాన్వితం, స్వోత్తమాచార్యసేవానభిజ్ఞం, కృతఘ్నం, నృశంసం, మహాఘౌఘసిన్ధౌ నిమగ్నం కృపామ్భోనిధే! పాహి! నిశ్చఞ్చలాం తే పదామ్భోజయుగ్మే చ భక్తిం ప్రభో! దేహి! సుజ్ఞానవన్తం కురుష్వాశు, 9

యత్తే మనోజ్ఞం లసత్పుణ్డరీకాయతాక్షం, ప్రసన్నాననం, చారుమన్దస్మితం, శోభనాఙ్గం, శశాఙ్కప్రభం, దివ్యసద్గన్ధభూషామ్బరాలంకృతం, శ్రీసఖం, సచ్చిదానన్దరూపం సదాऽస్మన్మనఃపఙ్కజాతే స్థిరం స్థాపయానన్తశక్తే!, 10

జయ! వాజివక్త్ర! ప్రభో! జయ! సిన్ధుకన్యాపతే! జయ! దేవచూడామణే! జయానన్తమూర్తే! జయానన్దసిన్ధో! జయాగాధబోధ! ప్రభో! శ్రీరమానాథ! లోకైకనాథా-ప్రమేయాచ్యుతానన్త! గోవిన్ద! తుభ్యం నమస్తే నమస్తే నమస్తే నమః. పాహి మాం పాహి!,11





శ్రీః

శ్రీవాదిరాజతీర్థవిరచితః

# శ్రీహయగ్రీవదణ్డకః

జయజయ తురంగాస్య! = హయగ్రీవా! వర్ధిల్లుము. వర్ధిల్లుము. నస్తః ముఖాత్ = ముక్కు మరియు నోటినుండి, నిస్సృత = వెలువడిన, అనన్త = అంతులేని, వేదాదివిద్యా = వేదములు మొదలుగాకల విద్యలచే, ప్రబోధీకృత+= జ్ఞానవంతునిగా చేయబడిన, అమ్భోజసమ్భూత! = బ్రహ్మదేవుడు కలవాడా!, హేషారవోన్నిర్జితాశేషదైతేయ! = సకిలింపుధ్వనితోనే సమస్త దైత్యులను పారద్రోలిన వాడా!, లక్ష్మ్యా+= లక్ష్మీదేవిచేత, అమృతేన+= అమృతముతో, అనిశమ్ = ఎల్లప్పుడు, సిచ్యమానాంగ! = తడుపబడుచున్న దేహము కలవాడా!, రాకేన్దుకోటి = కోటిమంది పూర్ణిమా చన్ద్రులతో, ప్రతీకాశ = సమానమైన, దేహప్రభా = శరీరకాంతితో, భాసిత+ = ప్రకాశింపజేయబడిన, అబ్జాతగర్భాణ్డ = బ్రహ్మాండము యొక్క, బాహ్యాన్తర! = వెలుపలి, మరియు లోపలి ప్రదేశములు కలిగినవాడా!,

ఆనమ్ర = (భక్తితో) వంగి నటువంటి, ధాత్రీశరుద్రేన్ద్ర = బ్రహ్మ, ఈశ్వరుడు, రుద్రుడు, ఇన్ద్రుడు, ముఖ్య+ = మొదలుగాకల, అమరవ్రాత = దేవసమూహము యొక్క, కోటీరమాణిక్యకాన్తిచ్ఛటా = కిరీటములలోని మణుల యొక్క కాన్తి సముదాయముచేత, రంజితాంఘ్రే! = అలంకరించబడిన పాదములు కలవాడా!, హృన్మందిరధ్వాన్తరాశేః = హృదయము అనెడు మందిరములోగల (అజ్ఞానము అనెడి) చీకటి సముదాయమునకు, శరచ్చన్ద్ర! = శరత్కాలపు చన్ద్రుని వంటివాడా!. 1

దేవ! = ఓ ప్రభూ, ప్రపన్న+ = శరణుచొచ్చిన వారలకు, అమరానోకహః = కల్పవృక్షము వంటివాడవైన, త్వమ్ = నీవు, పురా = పూర్వము, నారాయణాఖ్యేన = నారాయణుడు అను పేరుగల, రూపేణ = రూపముతో, లోకమ్ = లోకమును, స్వగర్భే = నీ ఉదరమునందు, నిధాయ = ఉంచి, శ్రియః = లక్ష్మీదేవియొక్క, బాహుయుగ్మాన్తరే = రెండు బాహువుల నడుమ ప్రదేశమందు, సంస్థితః సన్ = ఉన్నవాడవు అగుచూ, సిసృక్షుః = సృష్టిచేయ కోరిక గలవాడవైన, త్వమ్ = నీవు, ఆదౌ = మొట్టమొదట, విధాతారమ్+ = బ్రహ్మను, ఆసృజ్య = పుట్టించి, తత్సత్రయాగే = ఆ బ్రహ్మదేవుని సత్రయాగమునందు, హయగ్రీవరూపమ్ = గుఱ్ఱపుమెడగల రూపమును, సమాస్థాయ = పొంది, దైత్యాధమమ్ = దైత్యులలో నీచుడును, లోకశత్రుమ్ = లోకములకు శత్రువును అయిన, మధుమ్ = మధువును, కైటభాఖ్యం చ = కైటభుడు అనుపేరుగల వానిని కూడ, చక్రేణ = చక్రాయుధముతో, హత్వా = చంపి, పునః = మరల, లోకసంరక్షణార్థమ్ = లోకములను సంరక్షించుటకొరకు, ఝషాద్యావతారైః = మత్స్యము మొదలుగా కల అవతారములతో, మహాదైత్యసంఘాన్ = గొప్ప గొప్ప రాక్షస సమూహములను, వినిర్మథ్య = మథించి (నిర్మూలించి), లోకాన్ = లోకములను, సదా = ఎల్లప్పుడు, పాసి = రక్షించుచున్నావు. భో దేవ! = ఓ దేవా!, యః = ఏ, మనుష్యోత్తమః = ఉత్తమ మనుష్యుడు, త్వామ్ = నిన్ను, దుగ్ధపాథోధిమధ్యస్థ = పాలసముద్రము యొక్క మధ్యలో ఉన్నటువంటి, సుశ్వేత-నామోల్లసద్ద్వీపమధ్యే = శ్వేతద్వీపము అను పేరుతో విరాజిల్లుచున్నటువంటి ద్వీపము యొక్క మధ్యభాగమునందు, సుసంతానవృక్షావలీవేష్టితే = గొప్పవైన సంతావృక్షములతో ఆవరింపబడియున్న, సన్మణిస్తమ్భయుక్తే = మంచిమణిమయమైన స్తంభములతోకూడియున్న, మహామండపే = ఒకగొప్ప మండపమునందు, తత్ర పంకేరుహే = అందులోని ఒక పద్మమునందు, కర్ణికాయామ్ = దాని కాడయందు, సుధాసూతిబింబే = దానిలోపలగల

చంద్రబింబమునందు, మహాయోగపీఠే = దానిలోగల గొప్పయోగపీఠము నందు, నిషణ్ణమ్ = ఆసీనుడైన వానినిగాను.

నమత్ = నమస్కరించుచున్నటువంటి, దేవతా = దేవతలయొక్క, మౌళి = శిరస్సులలోని, మందారమాలా = మందారపుష్పమాలలనుండి, స్రవత్ = కారుచున్న, మాకరంద ద్రవ = మకరందద్రవముచేత, క్షాళితేన+ = కడుగబడిన, అంకుశ = అంకుశము, ఛత్ర = చత్రము, పాఠీన = మత్స్యము, వజ్ర+ = వజ్రము, అంబుజాత+ = శంఖము, ఊర్ధ్వరేఖా+ = నిలువుగీత, అంకితేన+ = ఈ గుర్తులతో కూడిన, అంఘ్రియుగ్మేన = రెండుపాదములతో, సంరాజితమ్ = వెలుగొందుచున్న వానినిగాను, శ్వేతకూర్మాభగుల్ఫమ్ = తెల్లని తాబేలుతో సమానమైన చీలమండలు కలిగిన వానినిగాను, లసత్ = ప్రకాశించుచున్న, జానుయుగ్మమ్ = రెండు మోకాళ్ళు కలవానిని గాను, దిశాదన్తి-శుండోపమోరుద్వయమ్ = దిగ్గజముల తొండములతో సమానమైన రెండు ఊరువులు కలవానినిగాను, దుగ్ధసింధ్వన్తరీపోపమేన+ = పాలసముద్రపు మధ్యలోగల ద్వీపముతో సమానమైన, అచ్ఛకౌశేయవస్త్రాభిరామేణ = స్వచ్ఛమైన పట్టువస్త్రముతో సుందరమైన, భాస్వన్నితమ్బేన యుక్తమ్ = మెరయుచున్న నితంబముతో కూడుకొనియున్న వానినిగాను, వియద్వాహినీ = గంగానదియొక్క, వర్తులావర్త = గుండ్రని సుడిగుండమువలె, గంభీర = లోతైన, నాభీసరః+ = చెరువువంటి నాభియొక్క, తీరసంజాత = ఒడ్డున పుట్టిన, రోమావళీమండితేన+ = రోమసముదాయముతో అలంకరింపబడిన, ఉదరేణ+ = ఉదరభాగముతో, అంచితమ్ = శోభిల్లువానినిగాను, శ్రీనివాసాయిత+ = లక్ష్మీదేవికి నివాస స్థలముగా మారిన, ఉరః స్థలమ్ = వక్షఃస్థలము కలవానిని గాను, శేషభోగాభహస్తైః చతుర్భిః = ఆదిశేషునియొక్క శరీరముతో సమానమైన నాలుగు చేతులతో, సదా = ఎల్లప్పుడు, శంఖ = శంఖము, ముక్తాక్షమాలా = ముత్యములతో చేయబడిన జపమాల, లసత్ పుస్తక = ప్రకాశించు పుస్తకము, ఉద్బోధయుక్త+అరవిందాని = చిన్ముద్రతో కూడియున్న పద్మములను, సమ్యక్ = చక్కగా, దధానమ్ = ధరించియున్న వానిని గాను, రణత్ = ఝుంకారము చేయుచున్న, భృంగ = తుమ్మెదలతో, సంసక్త = కూడియున్న, సంపుల్ల = వికసించిన, మందారమాలావలీ = మందారపుష్పమాలల సముదాయములతో, లగ్న = కూడియున్న, సత్కంఠశోభాభిరామమ్ = చక్కని కంఠముయొక్క శోభతో మనోహరమైన వానిని గాను, శశాంకాంశు-సంకాశ = చంద్రకిరణములతో సమానమైన, సత్కేసరవ్రాత

= చక్కని కేసరముల సమూహము గల, కేశావళీ–మండితమ్ = కేశసమూహముతో అలంకరింపబడిన వానినిగాను, దంత–కాంతిచ్ఛటా = తెల్లని దంతకాంతి పుంజముతో, భాసిత+ = ప్రకాశింప జేయబడిన, ఆశావకాశమ్ = దిక్కులమూల ప్రదేశములు కలవానిని గాను, దలత్ పద్మపత్రాయతాక్షమ్ = వికసించిన పద్మపత్రము వలె పెద్దకన్నులు కలవానిని గాను, స్ఫురత్ = ప్రకాశించుచున్న, దక్షిణావర్తశంఖ–ప్రతీకాశకర్ణమ్ = కుడివైపుకు తిరిగినటువంటి శంఖముతో సమానమైన చెవి కలిగిన వానిని గాను, లసన్మస్తకమ్ = విరాజిల్లుచున్న శిరస్సు కల వానినిగాను, దివ్య = దివ్యమైన, ముక్తామయ+ = ముత్యములతో నిండిన, ఉదార = పెద్దవి అయిన, కోటీర = కిరీటము, కేయూర = కేయూరములు (భుజకీర్తులు), హారావళీ = కంఠాభరణములు, మేఖల+ = మొలత్రాడు, ఆద్య+ = మొదలైన, అఖిలైః = సమస్తములైన, భూషణైః = అలంకారములతో, భూషితమ్ = అలంకరింపబడినవానినిగాను, చందన+ = చందనముతో, ఆ చర్చిత+ = బాగుగ పూయబడిన, అశేష–గాత్రమ్ = సమస్త శరీరము కలవానిని గాను, సదా = ఎల్లప్పుడు, మూర్తిమత్ = ఆకారమును ధరించినటువంటి, వేద–శాస్త్ర+ఇతిహాసాది–విద్యావలీ–సేవితమ్ = వేదములు, శాస్త్రములు, ఇతిహాసములు మొదలుగాకల విద్యల సముదాయముతో సేవింప బడుచున్న వానినిగాను, శ్రీసతీ = లక్ష్మీదేవియొక్క, చంచల+ = చంచలములైన, అపాంగ = క్రీగంటి చూపులతో, నీరాజితమ్ = నీరాజనము ఇవ్వబడుచున్న వానినిగాను, బ్రహ్మరుద్రాదివంద్యమ్ = బ్రహ్మ, రుద్రుడు మున్నగు దేవతలతో నమస్కరింపబడుచున్న వానిని గాను, మనఃపంకజే = తన మనస్సు అనెడి పద్మము నందు, చింతయన్ = ధ్యానించుచు, 3

దేవ! = ఓ ప్రభూ!, బాహ్యే = బాహ్యప్రదేశమునందు, హరిత్ = పసుపు, గోమయ+ = ఆవు పేడ, (మొదలుగా కలిగిన పవిత్ర ద్రవ్యములతో), ఆలిప్తకే = అలకబడినటు వంటిదియును, రంగవల్లీ = రంగవల్లుల యొక్క, సుశోభాంచితే = గొప్పశోభలతో కూడియున్నదియును అగు, స్థండిలే = నేలయందు, శ్వేత–కౌశేయ–వస్త్రావృతే = తెల్లని పట్టువస్త్రముతో ఆవరింపబడినదియును, మాలతీ–మల్లికాది–ప్రసూనావలీ–మండితే = మాలతి, మల్లె మొదలగు పుష్పములతో అలంకరింపబడినదియును, చక్రపద్మాదిసన్మండలోపేతపీఠే = చక్రము, పద్మము మొదలగు మంచి మండలములతో కూడినదియును అగు పీట యందు, యథా = ఎట్లైతే, యాజ్ఞికాః = పురోహితులు (యజ్ఞము

చేయువారు), బాహ్యావహ్నౌ = బయట ఉన్నటువంటి అగ్నియందు, నిజాన్తఃస్థమ్ = తన లోపల ఉన్న, అగ్నిమ్ = అగ్నిని, మన్త్రాక్షతైః = మంత్ర పూతమైన అక్షతలతో, సమాకృష్య = బాగుగ ఆకర్షించి, స్థాపయిత్వా+ = ఉంచి, అర్చయన్తి స్మ = పూజింతురో, తద్వత్ = అట్లే, బహిర్యోగమార్గేణ = బహిర్యోగమార్గముతో, హృత్పద్మమధ్యస్థమ్+ = హృదయపుండరీకములో నున్న, ఈశమ్ = పరమేశ్వరుని, స్వబింబే = తాను ఏర్పాటుచేసికొన్న పరమేశ్వర ప్రతిమయందు, ప్రతిష్ఠాప్య = ప్రతిష్ఠించి, నిత్యమ్ = ఎల్లప్పుడు, త్వదష్టాక్షరేణ+ = నీ అష్టాక్షరీమంత్రముతో, ఉక్తమార్గేణ = చెప్పబడినమార్గముతో, సంపూజయన్ = పూజించుచూ, వర్తతే = ఉండునో, 4

యద్వా = లేక, దేవ! = ఓ ప్రభూ!, సువర్ణాదిస ల్లోహపాత్రేషు వా = బంగారు మొదలుగాకల మంచి లోహపాత్రలలో కాని, భూర్జ–పత్రేషు వా = భూర్జ పత్రముల యందుగాని, పట్టవస్త్రేషు వా = పట్టవస్త్రములయందుగాని, వహ్నిపూర్వాణదిగ్రాజదన్తారకేషు = కొన్ని గడుల యందు, త్వదీయమ్=నీకు సంబంధించిన (నీ మంత్రమునకు సంబంధించిన), ఏకవర్ణమ్ = ఒక్కొక్క గడియందు ఒక్కొక్క అక్షరము చొ॥న, క్రమాత్ = వరుసగ, లిఖిత్వా+ = వ్రాసి, అథ = ఆ తరువాత, పంచాక్షరమ్ = పంచాక్షరీమంత్రమును, గారుడం చ అష్టవర్ణమ్ = గరుత్మంతుని అష్టాక్షరీ మంత్రమును, స్వరానుష్టుభమ్ = స్వరానుష్టుభమును – 16 అచ్చులను, సమ్యక్+ = బాగుగ, ఆలిఖ్య = వ్రాసి, తద్వత్ = అట్లే, బహిర్బీజమార్గేషు+ = బహిర్బీజమార్గముల యందు, అసఙ్గాక్షరైః = అసంయుక్తములైన, కాదిసాన్తైః = క నుండి స వరకు గల అక్షరములతో, క్రమాత్ = వరుసగా, వేష్టయిత్వా = ఆ మంత్రాక్షరముల చుట్టును వ్రాసి, తతః+ = అటుపిమ్మట, వ్యోమ–యుగ్మమ్ = వ్యోమయుగ్మమును, ధరామండలే = భూమండలమునందు, దిక్పతీనామ్ = దిక్పాలకులయొక్క, బీజాని చ = బీజాక్షరములను కూడ, సంలిఖ్య = వ్రాసి, త్వద్బింబవత్ = నీ ప్రతిమనువలె, గంధపుష్పోపహారాదిభిర్ = గంధము, పుష్పములు, నైవేద్యములతో, భక్తిభావేన = భక్తి భావముతో, సంపూజ్య = పూజించి, సన్మంత్రసిద్ధో భవేత్ = నీ మన్త్ర సిద్ధుడైనచో, తస్య = అతనియొక్క, వక్త్రే = ముఖమునందు, శారదా = సరస్వతీదేవి, స్థిరా = స్థిరమైనదిగా ఉండును. తస్య = అతనియొక్క, గేహే = గృహమునందు, శ్రీః = లక్ష్మీదేవి, ధ్రువా = నిశ్చలముగా ఉండును. నృపాలాదయః = రాజులు, చక్రవర్తులు మున్నగువారు, స్వయమ్ = స్వయముగా, తస్య = అతనికి, దాసాః = సేవచేసెదరు. తస్య = అతనికి,

శాశ్వతీ = శాశ్వతమైన, భక్తిర్ = భక్తి, భవేత్ = కలుగును. తస్య = అతనికి, అశ్రుతప్రజ్ఞయా = కని, విని ఎఱుగని ప్రజ్ఞతో, విద్యాః = విద్యలు, స్ఫురన్తి = భాసిల్లును. తస్య = అతనికి, పుత్త్రాదివృద్ధిర్ = సంతానవృద్ధి, భవేత్ = కలుగును. తస్య = అతనికి, అఖిలాః = సమస్తములైన, వాఞ్ఛాః = కోరికలు, లభన్తే = పొందబడును. 5

యద్వా = లేక, మనోః = హయగ్రీవ మన్త్రమును, జంజపూకః = బాగుగ జపము చేసినవాడు, భ్రువోః అన్తరే = రెండు కనుబొమల నడుమ ప్రదేశమునందు, సమస్తాగమాన్+ఉద్గిరన్తమ్ = సమస్త వేదములను ఉపదేశించు చున్నట్లుగా నున్న, త్వామ్ = నిన్ను, సమాచిన్త్య = ధ్యానించి, తత్రైవ = అక్కడే, దీర్ఘాన్వితమ్ = దీర్ఘముతో కూడియున్న, బిందుయుక్తమ్ = బిందువు (అనుస్వారము)తో కూడియున్న, చతుర్థోష్మరూపమ్ = హకారరూపమైన, సాన్వితమ్ = సకారముతో కూడియున్న, మనుమ్ = మంత్రమును (హ్సామ్), సమ్యక్ = బాగుగ, ఉచ్చార్య = పలికి, సాయం ముఖే = సాయంకాలం ప్రారంభసమయమందు, ముక్తనామాసనే = ముక్తము అను పేరు కలిగిన ఆసనమునందు, సన్నివేశ్య+ = కూర్చొని, అనిలమ్ చ = గాలిని, ఇలయా = ఇలానాడితో, పూరయన్ = పూరించుచూ, కేవలే = కేవలము, కుంభకే = కుంభకమునందు, సంస్థితః సన్ = ఉన్నవాడు అగుచూ, తత = విస్తారముచేసి, ఊర్ధ్వీకృతేన = పైకి నిలుపబడిన, స్వజిహ్వాగ్రభాగేన = తననాలుక చివరి భాగముతో, రంధ్రమ్ = కంఠరంధ్రమును, నిరుధ్య+ = మూసివేసి, ఉద్గతమ్ = అక్కడ ఆవిర్భవించుచున్న, సోమనీరమ్ = సోమనీరమును (అమృతమును), ప్రత్యహమ్ = ప్రతిరోజూ, పిబేత్ = త్రాగునో, తస్య = అతనికి, గీర్వాణవాణీ = సంస్కృతభాష, వశా = స్వాధీనమగును, తస్య = అతనికి, పాతంజలమ్ = పతంజలి ప్రోక్తమైన వ్యాకరణశాస్త్రము, జలమ్ = మంచినీటి ప్రాయము, స్యాత్ = అగును. తస్య = అతనికి, భాట్టమ్ = పూర్వమీమాంసాశాస్త్రము, ఘరట్టోత్థపిష్టోపమమ్ = తిరుగలి నుండి వచ్చిన పిండితో సమానమైనది. తస్య = అతనికి, తర్కస్తు = తర్కశాస్త్రమున్ను, పాణిస్థ–కర్కన్ధుకా = అరచేతిలో నున్న ఉసిరిక కాయతో సమానమైనది, తస్య = అతనికి, వైయాసకీ గీః = వ్యాసప్రోక్తమైన వేదాంతశాస్త్రము, మరున్మోచికా = ఉఫ్ అను క్రియతో సమానము.
సైషః (స+ఏషః) = అతడు, వాదేషు = శాస్త్రార్థవాదములయందు, పంచాననః = సింహము వంటివాడు, అగును. దేవ! = ఓ ప్రభూ!, యో వా = ఎవరైతే, బ్రాహ్మికా పాచితమ్ = సరస్వతీ ఆకుతో వండబడిన, ఘృతం వా = ఘృతమున్ను, త్వదీయేన మన్త్రేణ = నీ

మంత్రముతో, నిత్యమ్ = ఎల్లప్పుడు, పిబేత్ = త్రాగునో, అథవా = లేక, కంగులీబీజజాలాని = కొర్ర బియ్యపు గింజలను, వాచా+అభిమన్త్ర్య = నీ మంత్రవాక్కులతో మంత్రించి, త్వదీయేన మన్త్రేణ = నీ మంత్రముతో, నిత్యమ్ = ఎల్లప్పుడు, ఖాదయేత్ = తినునో (తినిపించునో), తస్య = అతని యొక్క, వక్త్రే = ముఖమునందు, సుధాసమ్మితమ్ = అమృతముతో సమానమైన, కవిత్వమ్ = కవిత్వము, సంభవేత్ = సంభవించును. తస్య = అతనియొక్క, బుద్ధిః = బుద్ధి, బహుగ్రన్థసంధారిణీ = అనేక గ్రంథములను గుర్తు ఉంచుకొను సామర్థ్యము కలదిగా, స్యాత్ = అగును. 6

ప్రభో! = ఓ ప్రభూ!, దేవ! = ఓ స్వామీ!, యత్ తే = ఏ నీయొక్క, పదామ్భోజశౌచోదకమ్ = నీ కాళ్లు కడిగిన ఉదకము, శూలపాణేః = పరమేశ్వరునకు, శిరోభూషణమ్ = తలపై పెట్టుకొను అలంకారమో!, యస్య = ఎవరియొక్క, నాభ్యుద్భవః = బొడ్డునుండి పుట్టినవాడు (బ్రహ్మ), లోకనిర్మాణకృత్ = లోకములను సృష్టించు, పద్మభూః = బ్రహ్మదేవుడో!, యస్య = ఎవరియొక్క, పౌత్రః = మనుమడు అగు, హరః = రుద్రుడు, సర్వసంహారకృత్ = సమస్తలోకములను సంహరించువాడో!, సమస్తాగమాః = సమస్తములైన వేదములు, యస్య = ఎవనియొక్క, నిశ్శ్వాసరూపాః = నిశ్శ్వాస స్వరూపములో!, యస్య = ఎవరియొక్క, పత్నీ = భార్యయైన లక్ష్మీదేవి యొక్క, కటాక్షస్య లేశః = స్వల్పమైన దయ, విధీశేన్ద్రముఖ్యామరస్థానదః = బ్రహ్మ, ఈశ్వరుడు, ఇన్ద్రుడు మున్నగు ముఖ్యమైన దేవతా పదవులను ఇచ్చునటువంటిదియో!, యస్య = ఎవరియొక్క, తల్పమ్ = శయ్య, సశైలాటవీసింధువిశ్వమ్భరాధారకః = పర్వతములు, అడవులు సముద్రములతో కూడిన భూగోళమును మోయునటువంటి, శేషభోగీశ్వరః = సర్పరాజు అయిన ఆదిశేషుడో!, యస్య = ఎవరియొక్క, వాహోత్తమః = వాహనశ్రేష్ఠము, సర్వవేదాభిమానీ = సమస్తవేదములు స్వరూపముగా కల, ఖగాధీశ్వరః = పక్షిరాజైన గరుత్మంతుడో!, యస్య = ఎవరియొక్క, వక్త్రాగ్నిమధ్యే = నోటిలోనుండి బయటికి వచ్చు అగ్నిలో, సురారాతిసంఘాః = రాక్షససమూహములు, పతంగాః = పక్షులుగా (మిడతలుగా), బభూవుః = అయినవో!, యస్య = ఎవరియొక్క, దివ్యాహ్వయః = దివ్యమైన పేరు, స్వయమ్ = స్వయముగానే, భక్తిభాజామ్ = భక్తికలిగిన, నృణామ్ = మనుష్యులకు, తీర్థకోట్యుత్థ–పుణ్యాధికః = కోట్లకొలది–తీర్థములనుండి వచ్చు పుణ్యముకంటే అధికమైన పుణ్యమును ఇచ్చునటువంటిదియో!, యస్య = ఎవరియొక్క, విజ్ఞానభక్త్యాఖ్య = విజ్ఞానము, భక్తి అనెడి, సత్ ద్రవ్యసంపాదకానామ్

= మంచి ధనమును సంపాదించువారలకు, అక్షయ+ ఆనందభోగః= తరగని ఆనందానుభవము, భవేత్ = కలుగునో. 7

ప్రభో! = ప్రభూ!, దేవ! = స్వామీ!, తం త్వామ్ = అటువంటి నిన్ను, అహమ్ = నేను, సచ్చిదానందమూర్తిమ్ = సత్, చిత్, ఆనందములే స్వరూపములగా కల వానిని, జగత్ = లోకములయొక్క, జన్మ = పుట్టుకకు, సంరక్షణ = సంరక్షణకు, జ్ఞాన = జ్ఞానమునకు, సంహార = సంహారమునకు, బంధాది = బంధము మొదలగు వానికి, హేతుమ్ = కారణభూతుడైన వానిని, నిరస్తాధికమ్ = సర్వాధికుని, నిస్సమమ్ = సాటిలేనివానిని, సద్గుణాంభోనిధిమ్ = సద్గుణములకు సముద్రము వంటి వానిని, నిత్యముక్తమ్ = ఎల్లప్పుడు ముక్తుడైన వానిని, నిజానన్దతృప్తమ్ = ఆత్మానందముతోనే తృప్తి చెందిన వానిని, విభుమ్ = సర్వవ్యాపకుని, నిర్గతాశేషదోషమ్ = ఎట్టి దోషములు లేనివానిని, నిరీశమ్ = తనకు మరొక ఈశ్వరుడు లేనివానిని, స్వరోమావళీకూప = తన రోమ సముదాయముల కూపమునందు, సంస్థ+ = ఉన్నటువంటి, అబ్జాతగర్భాండకోటివ్రజమ్ = కోట్లకొలది బ్రహ్మాండ సమూహములు కలవానిని, ముక్త = ముక్తులైన, వాగీశ = బృహస్పతి, భోగీశ = ఆదిశేషుడు, పక్షీశ = గరుత్మంతుడు, దేవేశ = ఇంద్రుడు, కందర్ప = మన్మథుడు, సూర్య+ = సూర్యుడు, ఆది = మొదలుగా కల, ముఖ్యామరైః = దేవతాప్రముఖులతో, సేవితమ్ = సేవించబడిన వానిని, శ్రీకరాంభోజ = లక్ష్మీదేవియొక్క పద్మమువంటి చేతులలోని, రత్నోర్మికా = రత్నమయమైన ఉంగరములయొక్క, దీధితిస్తోమ = కాంతి సముదాయముచేత, శోణీకృత+ = ఎఱ్ఱనివిగా చేయబడిన, అంఘ్రిద్వయమ్ = రెండు పాదములు కలవానిని, భక్తలోక+ = భక్తజనుల చేత, ఆర్జిత+ = సంపాదించబడిన, అనేకజన్మాఘశుష్కాటవీ = అనేకజన్మల పాపములు అనెడి ఎండిన అడవికి, పావకమ్ = అగ్నిహోత్రుని వంటి వానిని, సర్వవేదైక-వేద్యమ్ = సమస్త వేదములచే తెలుసుకోదగిన వానిని, సర్వదేవైక వంద్యమ్ = సమస్తదేవతల-చేత నమస్కరించబడువానిని, మహాయోగిహృన్మంటపమ్ = గొప్ప యోగులయొక్క హృదయమే నివాసస్థలముగా కలవానిని, సంతతానంత-భోగాసనమ్ = ఎల్లప్పుడు అనంత భోగములకు ఆశ్రయమైన వానిని, దేవదేవమ్ = దేవతలకే దేవుడైన వానిని, ప్రణమ్య = నమస్కరించి, ప్రభో = ఓ ప్రభూ!, ప్రార్థయే = నేను ప్రార్థించుచున్నాను. 8

సాధునిందా+ = సాధువులను నిందించుట, ఆత్మశంసా+ = ఆత్మస్తుతి చేసికొనుట, అశ్రుతగ్రంథవేత్తృత్వ = వినని గ్రంథములను సైతము తెలిసిన వానినిగ నటించుట,

దుశ్శాస్త్రవేత్తృత్వ = చెడు శాస్త్రములను తెలిసికొనుట, దుష్టాన్న-భోక్తృత్వ = అపరిశుద్ధమైన అన్నమును తినుట, దుష్టాత్మ-సేవా+ = దుర్మార్గులను సేవించుట, ఆది+ = మొదలుగాకల, అనన్తాపరాధాలయమ్ = అనంతములైన అపరాధములకు నిలయమైన వానిని, నిత్యకర్మానుష్ఠానదూరమ్ = సంధ్యావందనము మొదలుగాకల నిత్యకర్మానుష్ఠానమునకు దూరమైన వాడను, దురాచారిణమ్ = చెడుప్రవర్తన కలిగినవాడను, జ్ఞానహీనమ్ = జ్ఞానము లేనివాడను, సదా = ఎల్లప్పుడు, క్రోధలోభాద్యమిత్రాన్వితమ్ = క్రోధము, లోభము మొదలగు అంతశ్శత్రువులతో కూడిన వాడను, స్వోత్తమాచార్యసేవానభిజ్ఞమ్ = నాకంటే ఉత్తములైన ఆచార్యులను సేవించుట ఎఱుగని వాడను, కృతఘ్నమ్ = చేసిన మేలు మరచువాడను, నృశంసమ్ = దుర్మార్గుడను, మహాఘౌఘసింధౌ = మహాపాపసముద్రమునందు, నిమగ్నమ్ = మునిగిపోయినవాడను అగు నన్ను, కృపాంభోనిధే! = దయాసముద్రుడవైన ఓ హయగ్రీవా!, పాహి = రక్షింపుము, ప్రభో! = స్వామీ, తే = నీ యొక్క, పదాంభోజయుగ్మే = రెండు పాదపద్మములయందు, నిశ్చంచలామ్ = నిశ్చలమైన, భక్తిం చ = భక్తిని కూడ, దేహి = ఇమ్ము, ఆశు = శీఘ్రముగా, సుజ్ఞానవంతమ్ = మంచి జ్ఞానము కలిగిన వానినిగా, కురుష్వ = చేయుము. 9

మనోజ్ఞమ్ = మనోహరమైనదియు, లసత్ పుండరీకాయతాక్షమ్ = వికసించిన పద్మమువలె పొడవైన కన్నులు కలదియును, ప్రసన్నాననమ్ = ప్రసన్నమైన ముఖము కలదియును, చారు-మందస్మితమ్ = అందమైన చిఱునవ్వు కలదియును, శోభనాంగమ్ = మంచి అవయవములు కలదియును, శశాంకప్రభమ్ = చంద్రకాంతి కలదియును, దివ్య = దివ్యములైన, సద్గంధ = మంచిగంధము, భూషా+ = అలంకారములు, అంబర+ = వస్త్రములు చేత, అలంకృతమ్ = అలంకరింప బడినదియును, శ్రీసఖమ్ = లక్ష్మీదేవితో కూడినదియును అగు, తే = నీయొక్క, యత్ = ఏ, సచ్చిదానంద రూపమ్ = సత్, చిత్, ఆనందము స్వరూపముగా కల ఏ రూపము కలదో, ఆ రూపమును, అనంతశక్తే! = అనన్తమైన శక్తిగల ఓ హయగ్రీవా!, అస్మన్మనఃపంకజాతే = నా మనస్సు అనెడి పద్మమునందు, సదా = ఎల్లప్పుడు, స్థిరమ్ = నిశ్చలముగా, స్థాపయ = ఉంచుము. 10

వాజివక్త్ర! = గుఱ్ఱము ముఖం కలిగినవాడా, ప్రభో! = స్వామీ!, జయ = వర్ధిల్లుము, సింధుకన్యాపతే! = సముద్రము యొక్క కూతురు అయిన లక్ష్మీదేవికి పతి అయిన వాడా!, జయ = వర్ధిల్లుము, దేవచూడామణే! = దేవతలకు శిరోమణి వంటివాడా!, జయ =

వర్ధిల్లుము. అనన్తమూర్తే = లెక్కలేని ఆకారములు కలవాడా!, జయ = వర్ధిల్లుము. ఆనందసింధో! = ఆనందమునకు సముద్రము వంటివాడా!, జయ = వర్ధిల్లుము. అగాధబోధప్రభో! = అంతులేని జ్ఞానమునకు ప్రభువైనవాడా!, జయ = వర్ధిల్లుము. శ్రీరమానాథ! = శ్రీరమానాథా!, లోకైకనాథ! = లోకముల కన్నింటికి దిక్కు అయినవాడా!, అప్రమేయ! = అప్రమేయ!, అచ్యుత! = అచ్యుతా!, అనన్త! = అనన్తా!, గోవింద! = గోవిందా!, తుభ్యమ్ = నీకు, నమః = నమస్కారము, తే = నీకు, నమః = నమస్కారము, తే = నీకు, నమః = నమస్కారము, తే = నీకు, నమః = నమస్కారము, పాహి = రక్షింపుము, మామ్ = నన్ను, పాహి = రక్షింపుము. 11



ఓం హ్సౌం ఓం

**ఓం నమో భగవతే హయగ్రీవాయ విష్ణవే మహ్యం మేధాం ప్రజ్ఞాం ప్రయచ్ఛ స్వాహా ఓం**